# మొసలి కథ

ఫిలిప్పిస్ జానపద కథ





మొసలి కథ
ఫిలిప్పిస్ జానపద కథ

# మొసలి కథ

ఫిలిప్పీన్స్ జానపద కథ

హోసే, తెలుగు: కె. సురేష్



ఒక రోజు వాసు నది దగ్గర ఆడుకుంటున్నాడు.
అప్పుడు అతడికి ఎవరో ఏడుస్తూ ఉండటం
వినిపించింది.



వాసు అటూ, ఇటూ చూశాడు. ఒక ఉచ్చులో చిక్కుకున్న ఒక మొసలి అతడికి కనపడింది. "నేను ఏమైనా సహాయం చెయ్యగలనా?" మొసలిని అడిగాడు వాసు.

“ఈ ఉచ్చునుంచి నన్ను కాపాడితే నీకు ఒక బంగారు కంకణం ఇస్తాను,” అన్నది మొసలి.

ముడి విప్పి ఆ మొసలిని ఉచ్చునుంచి కాపాడాడు వాసు.

“నాకు కంకణం ఇవ్వు.”



"కంకణం ఇప్పుడు నా దగ్గర లేదు," అంది మొసలి.

"నా వీపు మీద కూర్చో, మనం వెళ్లి ఆ కంకణం తీసుకుందాం."



“నా దగ్గర బంగారు కంకణం లేదు. ఇప్పుడు నిన్ను తినేస్తాను!”

నది మధ్యలోకి వెళ్లిన తరువాత అంది మొసలి.





“ఇది న్యాయం కాదు!” వాసు అన్నాడు. “నిన్ను కాపాడాను. నన్ను ఎలా తింటావు?”

“మొసలికి ఆహారం అయ్యే అదృష్టం చాలా కొద్ది మంది పిల్లలకే దొరుకుతుంది,” మొసలి నవ్వుతూ అంది.

అప్పుడు, అక్కడికి ఒక పాత బుట్ట వచ్చింది. ''నువ్వు నన్ను తినటం న్యాయమేనా అని ఆ బుట్టని అడుగుదాం,'' అన్నాడు వాసు. ''సరే, అడిగి చూడు,'' ఒప్పుకుంది మొసలి.



“బుట్టా, బుట్టా,” వాసు అడిగాడు. “మా ఇద్దరి సమస్య నువ్వు పరిష్కరించాలి. ఈ మొసలి ఒక ఉచ్చులో చిక్కుకుని ఉంది. తనని కాపాడితే బంగారు కంకణం ఇస్తాను అంది. కానీ, నేను కాపాడిన తరవాత బంగారు కంకణం లేదు, నిన్ను తినేస్తాను అంటోంది. ఇది కృతజ్ఞత అనిపించుకుంటుందా?”







“నేను కొత్తగా ఉన్నప్పుడు యజమానికి బజారు నుంచి సరుకులు తెచ్చిపెట్టే దానిని. అతడి భార్యకి పళ్లు తెచ్చిపెట్టే దానిని. వాళ్ల పిల్లలతో ఆడుకునే దానిని. ఇప్పుడు ముసలి దానిని అయిన తరువాత నన్ను నదిలో పారేశారు,” బుట్ట చెప్పింది.





"మనుషులకు కృతజ్ఞత లేదు. అటువంటప్పుడు ఈ పిల్లవాడికి నువ్వు కృతజ్ఞత ఎందుకు చూపించాలి. వెంటనే ఇతడిని తినేశెయ్," అంది బుట్ట.

"నువ్వు చాలా మంచిదానివి," అంది మొసలి. "ఇప్పుడే ఇతడిని తినేస్తాను."



“లేదు!” అరిచాడు వాసు.

అప్పుడు నీటిలో తేలుతూ వస్తున్న ఒక టోపీ కనిపించింది. అతడు దానిని పిలిచాడు.



‘‘ఏమిటి విషయం?’’ టోపీ అడిగింది

‘‘ఉచ్చులో చిక్కుకున్న ఈ మొసలి ఏడుస్తుంటే చూశాను,’’ చెప్పాడు వాసు. ‘‘దీని ప్రాణాలను నేను కాపాడాను. ఇప్పుడు ఇది నన్ను తినేస్తానని అంటోంది. ఇది న్యాయమేనా?’’





“నేను కొత్తగా ఉన్నప్పుడు యజమాని రోజు నన్ను పెట్టుకుని గర్వంగా పట్టణానికి వెళ్లేవాడు. ఎండ నుంచి, వాన నుంచి నేను అతడికి రక్షణ ఇచ్చాను. కానీ, నేను పాతగా అయిన తరువాత నన్ను నదిలో పారేశాడు.”





“మనుషులకు కృతజ్ఞత లేదు, కాబట్టి నువ్వు కృతజ్ఞత చూపనవసరం లేదు. ఈ పిల్లవాడిని తినేశెయ్,” అంది టోపీ.



"విన్నావు కదా?" వాసుతో అంది మొసలి. తరవాత అతడిని తినెయ్యటానికి సిద్ధమయ్యింది.





“కాదు! అప్పుడే కాదు!” అన్నాడు వాసు. “ఆ అరటి చెట్టులో ఉన్న కోతిని అడుగుదాం.”

“సరే, తొందరగా కానివ్వు,” అసహనంగా అంది మొసలి. “ఇది నీ చివరి అవకాశం.”



“కోతీ, కోతీ!” వాసు పెద్దగా అరిచాడు. “ఈ మొసలి నన్ను తినెయ్యబోతోంది!”

“నాకు ఏమీ వినిపించటం లేదు!” కోతి అరిచింది. “కొంచెం దగ్గరగా రండి.”



మొసలి ఒడ్డువైపుకి ఈదసాగింది. వాసు మళ్లీ గట్టిగా అరిచాడు, "ఈ మొసలి ఒక ఉచ్చులో చిక్కుకుని ఉంది..."

"ఇప్పుడు కూడా నాకు ఏమీ వినపడటం లేదు!" కోతి అరిచింది.

"మరి కొంచెం దగ్గరకి రాకూడదూ?"

ఆ మొసలి ఒడ్డువైపుకి ఈదుతూ, "ఈ పిల్లవాడిని తొందరగా తినాలని ఉంది," అంటూ కోపంగా గొణిగింది.



అప్పుడు ఏమయ్యింది! వాసు ఒడ్డు మీదకి దూకి తన ప్రాణాలను కాపాడుకున్నాడు.

"నీకు ధన్యవాదాలు," అతడు కోతితో అన్నాడు. "నా ప్రాణాలు కాపాడావు. అందుకు నీకు ఎప్పుడూ కృతజ్ఞతతో ఉంటాను."



“నాకు ఒక సహాయం చెయ్యాలి,” కోతి అంది. “ఇంకా చాలా అరటి మొక్కలను పెట్టమని మీ నాన్నకి చెప్పు. అప్పుడు అందరికీ కావలసినన్ని అరటిపండ్లు దొరుకుతాయి. నేను ఎప్పుడైనా అరటి చెట్లలో కనపడితే నన్ను చూడనట్టు ఉండు. నా సంగతి ఎవరికీ చెప్పకు.”




"అలాగే చేస్తాను,'
వాసు మాట ఇచ్చాడు.



అయిపోయింది.